



ప్రథమ ముద్రణ : 1976 (శక 1898)
తృతీయ ముద్రణ : 1990 (శక 1912)



THE WORLD OF TREES (Telugu)
రూ. 6-50

డైరక్టరు, నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా,
ఎ-5, గ్రీన్ పార్కు, కొత్త ఢిల్లీ-110016
చే ప్రచురింపబడినది.



నెహ్రూ బాల పుస్తకాలయం

# వృక్ష జగత్తు

రచన :

రస్కిన్ బాండ్

చిత్రాలు :

సిద్ధార్థ బెనర్జీ

అనువాదం :

బాలాంత్రపు నళినీకాంతరావు



నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా

# మహావృక్షము మఱ్ఱి

మనుష్యులలో పొడవరులు సామాన్యంగా పరమ సాధు వులై ఉండేటట్లే, చెట్లలో పెద్ద తరహావి పరమ మిత్ర ములై ఉంటాయి. మన చెట్టుచేమ లన్నిటిలో మఱ్ఱి చెట్టు చాలా పెద్దది, ఎంతో స్నేహపూర్వకమైనది అని చెప్పవచ్చు.

ఈ రోజుల్లో మన నగరాలలో మఱ్ఱిచెట్లు ఎక్కువగా కనిపించవు. ఈ చెట్లకి చుట్టూ విస్తరించడానికి ఎక్కడ లేని చోటూ కావాలి. కాని జనాభా ఎక్కువగా వున్న మన నగరాలలో మనుష్యులు నివసించడానికే చోటు గటాగటిగా ఉన్నప్పుడు, మఱ్ఱిచెట్లు మనడాని కంత అవకాశం లేదు. పూర్తిగా పెరిగిన మఱ్ఱిచెట్టు మూడంత స్తుల భవనానికి కావలసినంత జాగా ఆక్రమించుకుం టుంది! ఉద్యాన వనాలలో మాత్రం మఱ్ఱి చెట్లకు లోపం లేదు. ప్రతి గ్రామంలోనూ కనీసం ఒక్కటయినా కనిపిస్తుంది.

మఱ్ఱిచెట్టుకి గాలిలో వ్రేలబడే వేళ్ళుంటాయి – మఱ్ఱి ఊడలు వేస్తుంది. ఊడ అంటే కొమ్మలనుంచి క్రిందికి దిగే వేరు. అది తిరిగి నేలలో పాతుకొని వంపులు తిరి గిన మరికొన్ని కొమ్మలు పెట్టుకొస్తుంది. కొన్నేళ్ళకి ఆ చెట్టు క్రింద ఒక చిట్టడవి ఏర్పడుతుంది. శివుని జడల గుంపుని వర్ణించడానికి ఊడల మఱ్ఱిని ఎన్నుకొనడంలో ఆశ్చర్యం ఏముంది?



చిగురాకులింకా ఎర్రగా, మృదువుగా ఉండగానే దేశపటాన్ని తలపించే నాజూకైన సీతాకోకచిలుక వచ్చి, వాలి, గ్రుడ్లు పెట్టి, ఆ ఆకుల కప్పగించి పోతుంది. ఆకులమీద ఉండే తేనె లాంటి తియ్యటి జిగురు పూతకోసం చిన్నారి చారల ఉడుతకూడా వస్తుంది.

డేగను పోలివుండే వానకోయిల వచ్చి వేసవి రాత్రులు మర్రిమీదనే గడుపుతుంది. ఆ పిట్ట బించుకొని, ఏకసాదింపుగా 'పిహూ పిహూ' అని కూస్తుంటే మీకు కొంతప్పుడు నిద్రపట్టి ఉండక పోవచ్చు. ఈ పక్షికి 'పావోస్ ఆల' (వాన వచ్చె) అని మహారాష్ట్రులు పేరు పెట్టారు. కాని ఆ పక్షి కూతవల్ల నిద్ర పట్టని ఒక ఆంగ్లేయుడు మాత్రం దానికి 'బ్రెయిన్ ఫీవర్ బర్డ్' (బుర్ర వేడెక్కిన పిట్ట) అని నామకరణం చేశాడు. అది గొంతెత్తి కూస్తూంటే 'ఓయమ్మో! ఓయమ్మో! వేసవి ముదిరిపోతోంది! ఎంతవేడి ... ఎంత వేడి ... ఎంతవేడి!' అని అరుస్తూన్నట్టుంటుందని ఆయన వాదం.

వానాకాలంలో నిజంగా సందడిగా ఉంటుంది మర్రి చెట్టు. దాని కొమ్మల్ని ఎర్రటి పళ్లు వేలాడిపోతూ ఉంటాయి. అయితే అవి మనం తినడానికి యోగ్యమైనవి కావు. (పొట్ట విప్పిచూడ పురుగులుండు). కాని చెట్టున చేరే పక్షిగణం - కేరింతల పికిలిపిట్టలు, కంచరిపురుగులు, కీచులాడే గోరింకలు, గొడవచేసే కాకులు - ఆ పళ్లను ఖందారగిస్తాయి. రాత్రి అయి, పక్షులు విశ్రాంతి తీసుకుంటున్నప్పుడు దెయ్యాల్లాంటి ఎగిరే నక్కలు రెక్కలు టపటపలాడిస్తూ చెట్టుచుట్టూ తిరుగుతాయి. అవి కొమ్మల కెగబాకుతూ, మర్రి పళ్లను చప్పుడు చేస్తూ తింటాయి.



మర్రి, 'అత్తి' కుటుంబానికి చెందిన చెట్టు. భారతదేశంలో ఈ జాతి చెట్లన్నీ పవిత్రమైనవిగా ఎంచబడుతున్నాయి. వీటిలో పిప్పల వృక్షము, అంటే రావి, సువిఖ్యాతమైంది. అలహాబాదులో త్రివేణీ సంగమం దగ్గరవున్న "అక్షయ వటము" (నశించని మర్రి) చుట్టూ ఎన్నో గాథలు అల్లుకొని ఉన్నాయి. ఇప్పటికీ లక్షలాది యాత్రికులు వెళ్ళి దానిని దర్శిస్తూంటారు. దీనిని మొదట వర్ణించి చెప్పినవాడు వెయ్యి సంవత్సరాల క్రిందట భారతదేశం వచ్చిన చైనీయ యాత్రికుడు, యువాన్‌చ్వాంగ్.



తరుత్రయము (తీన్‌తర్) - పవిత్రములైన మర్రి, రావి, జువ్వి చెట్లను మూడింటిని ఒకటిగా చేర్చి నాటింది - అతి పవిత్రమైంది. దీనిని 'హరిపీఠం' (హర్‌శంకరి) గా మన్నిస్తారు.

మర్రికి 'బాన్యన్' అనే ఇంగ్లీషు పేరు ఎలా వచ్చిందో! హిందీలో దీనిని 'బర్' అనీ తమిళంలో 'ఆల' అనీ అంటారు. అది సరే -భారత దేశానికి వచ్చిన మొదటి యూరోపియనులు 'బనియా' లకు (హిందీ : వర్తకులకు) - అంటే హిందువులైన 'వణిజు' లకు - ఈ చెట్టు అభిమాన పాత్రమైందని కనిపెట్టినట్టున్నారు. దైవారాధనకో, వ్యాపారానికో వణిజులు దీని

కింద చేరేవారు. అందుచేత ఆ యూరోపియనులు దీనికి 'బానియన్' అని పేరు పెట్టారు. ఆ పేరు తరువాత 'బాన్యన్' అయింది.

మ్రి మానవులకంత ఉపయోగపడని మహావృక్ష మనుకుంటారేమో! అది సరికాదు - మ్రిమాను చేవగలది, వంచితే విరగనిది - డేరా కొయ్యలుగా, కావడి బద్దలుగా, ఎడ్లబండికి కాడికర్రగా శతాబ్దాలుగా ఉపయోగ పడుతోంది; మ్రిరొట్ట ఎప్పుడూ ఏనుగులకి ప్రీతిపాత్రమైన అల్పాహారమై ఉంటోంది.

రోడ్డు వారల బారులు కట్టిన మ్రిచెట్లు ఇదివరకుటంత తరుచుగా ఇప్పుడు కనిపించవు. మ్రికి ఆసరాగా ఉండే ఆ అందాల ఊడలను నరికివేస్తూంటా రెందుకో. రోడ్డు ప్రక్కల ఊడలు కోల్పోయిన మ్రిచెట్లు కనిపించినప్పుడల్లా ఎంతో విచారం కలుగుతుంది. ఎండ నిప్పులు చెరుగుతున్న రోజున చల్లగా, హాయిగా ఉండే అంత నీడని మ్రిలా మరే చెట్టూ మనకి ప్రసాదించదు. మరెందుకు కాకపోయినా, ఈ ఉపకారానికి ఈ దొడ్డవృక్షము మనం ఎంతయినా శ్రద్ధాభిమానాలతో చూడ తగ్గది.

జార్జి మోరిస్ రచించిన ఈ కింది పంక్తులు మన మ్రి మిత్రానికి చక్కగా నప్పుతాయి:

కట్టెలు కొట్టేవాడా, కనికరించు ఆ చెట్టును!
కొట్టివేయ వద్దు సుమా! కొమ్మ ఒక్కటైనను -
ప్రాయమందు నాకు నీడపట్టయి నిలిచింది తాను;
పాప, మిపుడు దానిని కాపాడ కోరుదును నేను.

# దేవతాతరువు రావి

రావిచెట్ల కెలాగయినా అట్టహాస మెక్కువ. మన దృష్టి ఆకర్షించడం కోసం, గాలి వీచనప్పుడు కూడా, వాటి అందమైన ఆకులు బొంగరాల్లా అల్లాడిపోతూ, మనల్ని వాటి నీడలోకి రమ్మని ఆహ్వానిస్తాయి. ఆ విధంగా అవి కిందకి తెరలు తెరలుగా చల్లని గాలిని పంపించడమే కాదు, పొడవుగా సన్నగా ఉండే వాటి కొనలన్నీ చేరి విడవకుండా బజాయిస్తూ చినుకులు చిటపటలాంటి శబ్దం కూడా ఉత్పన్నం చేస్తాయి.

పూర్వకాలపు ఋషులు ఈ చెట్లకింద కూర్చుని తపస్సు సాగించా రంటే అందులో ఆశ్చర్యం లేదు. ఆ తరవాత గౌతమ బుద్ధుడికి, ఒక అశ్వత్థవృక్షం - అంటే రావిచెట్టు - కింద కూర్చుండగానే 'సంబోధి' కలిగింది. ఆ చెట్టుకి 'బోధి' అంటే 'జ్ఞానవృక్ష' మన్న పేరు వచ్చింది.

హిందువులు రావిని దేవతా వృక్షంగా కొలుస్తారు. దాని వేళ్ళు బ్రహ్మ అనీ, దాని బెరడు విష్ణువనీ, దాని కొమ్మ మహేశ్వరుడనీ వారి విశ్వాసం. "చిన్న విత్తులో పెనురావి అడగి ఉన్నట్టే, సమస్త విశ్వమూ బ్రహ్మంలో ఇమిడి ఉన్న" దని విష్ణుపురాణం చెబుతుంది.

సోమవారం నాడు అమావాస్య వచ్చినప్పుడు, మన గ్రామసీమలో స్త్రీలు ఇప్పటికీ రావిని ఆరాధిస్తారు. దాని మ్రానుమీద నీళ్ళుపోసి, దాని మొదట్లో డబ్బులూ, ఉపహారంగా తీపి పదార్థాలూ ఉంచుతారు.

రావిచెట్టు కింద అబద్ధమాడినా, మోసం చేసినా చేటు కలుగుతుం దని ప్రతీతి. దుకాణాదార్లను అప్పుడప్పుడు "బజార్లో రావిమొక్క నాటడం మీకు మంచిది కాదు సుమా!" అని ఉడికిస్తూంటారు. అయిన ప్పటికీ మన బజార్లలో కావలసినన్ని రావిచెట్లు కనిపిస్తూనే ఉంటాయి. విత్తనం పడిన చోటల్లా మొలిచే చెట్టు రావి. గోడలోనూ, ఇంటి నడి

కొప్పుమీద, అవకాశమిస్తే వేరొక చెట్టు కొమ్మ పంగ లోనూ కూడా వేరు దన్నడానికి అభ్యంతరం లేదు దానికి! దాని వేళ్ళు ఇటుకలలోంచి, గచ్చులోంచి తన్నుకురాగల శక్తిగలవి కాబట్టి, రావిని కట్టడాలకు కొంచెం దూరంగా నాటడం ఉత్తమం.

రావి ఆకంత పూర్తిగా కొనదేరిన ఆకు మరే చెట్టుకు లేదు. వర్షం పడినప్పుడు నీరు ఆకు కొనలనుండి జాలు వారడం మనం చూడవచ్చు. మొద్దుగా ఉండే కొస నుంచికన్న, మొనదేరిన కొసనుంచి అయితే నీరు ఎంతో సులువుగా జారిపోతుంది. ఎంత త్వరగా ఆకు పొడారితే అంత మంచిది చెట్టుకి.

రావి ఆకు చూడ ముచ్చటగా ఉంటుంది. తీర్చిన పురుషుని వీపును నరిపోలుతుంది. కాడ (మనిషి మెడ) నుంచి ఆకు అంచులు తిన్నగా ఇటు అటు (బుజముల వెంట) సాగి, గుండ్రంగా లోపలికి వంపు తిరిగి, కిందికి దిగి (నడుం దిగువ) మొన (వెన్నుపూస కొస) దేరు తాయి. రావి ఆకును చూస్తే సన్నని నడుం మీద



చదరంగా వెడల్పుగా ఉండే వీపు - అంటే కృష్ణుని బొమ్మలలో మనం చూసే ఆకృతి స్ఫురిస్తుంది.

మర్రిమీద వాసం చేసేవి ముఖ్యంగా వివిధ పక్షులూ, కీటకాలు అయితే, రావి అనేక రకాల భూతాలకి, తుంటరి పిశాచాలకి ఉనికిపట్టు అంటారు.

ఈ తుంటరులలో తుంటరి ముంజియా. నిర్జన స్థలాల్లో ఉండే రావుల మీద ఈ దుష్టుడి వాసం. దారిని పోయే గుఱ్ఱపు బళ్లమీద, ఎడ్లబళ్లమీద, బస్సులమీద అమాంతంగా దాడిచేసి వాటిని బోల్తా కొట్టించడానికి శాయ



శక్తులా ప్రయత్నిస్తాడు. 'రావి చెట్టు కిందనుంచి పోతూ ఆవలించ వద్దు సుమా!' అని మన ముసలమ్మ లిప్పటికీ మనల్ని హెచ్చరిస్తూం టారు. తప్పని సరయితే ఆవలించిన నోటికి చేతిని అడ్డం పెట్టుకో వడమో, దాని ముందు చిటికెలు వెయ్యడమో చెయ్యాలి. "అలా

చెయ్యకపోతే, ముంజియా నీ గొంతులోంచి పొట్టలోకి దిగి, నీ జీర్ణశక్తిని నాశనం చేసి ఒదిలి పెడతాడు!" అని భయపెడుతుంది ముసలమ్మ.

రావులు చిరజీవులు. హరిద్వారంలో కొన్ని ప్రాచీనమైన రావులున్నాయి. అవి ఈనాటి హరిద్వార పట్టణం కంటె కూడా పూర్వపువి. బహుశా వాటికి పదకొండవ శతాబ్దికి చెందిన మాయాదేవి ఆలయానికి ఉండే వయస్సు ఉంటుంది. క్రీస్తు పూర్వం 288 లో భారతదేశాన్నుంచి శ్రీలంకకు తీసుకొని వెళ్ళిన రావి ఒకటి అక్కడ ఇంకా బ్రతికి, పచ్చగా ఉంది. శతాబ్దాలు గడచినా, దాని పేరు పెంపులకు సంబంధించిన రికార్డులు శ్రద్ధగా భద్రపరచడం జరిగింది. దాని కిప్పుడు 2,257 సంవత్సరాల వయస్సు ఉండి ఉండాలి.

ఒకప్పుడు రావిచెట్టును కొట్టివెయ్యడం మహాపాపంగా పరిగణించబడింది. దానికి బదులు, ఎవరైనా రావి మొక్కను వేసినట్టయితే వారు ముందు తరాల వారి దీవనలను పొందగలరని ఎంచడం జరిగింది.

మనం కూడా భావితరాల వారి మన్ననలు సంపాదిద్దాం. ఇతోధికంగా రావి మొక్కలే కాదు, అన్ని రకాల చెట్లూ వేద్దాం. రావి మొక్కలు వాటి యోగక్షేమం అవే చూసుకో గలిగినవి. నీడకోసం, మరుగుకోసం, పండ్ల కోసం, పువ్వులకోసం, అందంకోసం, ఉపయోగం కోసం అన్ని రకాల చెట్లూ వేద్దాం.

చెట్టు చేమలేవీ లేని దేశాన్ని మనం ఊహించ గలమా? ఈ మూల నుంచి ఆ మూలవరకూ ఏక ఎడారిగా మారిపోయిన దేశాన్ని? మనం మన చెట్లనూ, అడవులనూ కొట్టివేస్తూ వస్తే, వాటి స్థానే కొత్తవాటిని పెంచడానికి ఒళ్ళు వంచకపోతే-మనదేశం కూడా అలాటి స్థితికి రావడం తప్పదు.



# మామిడితోటలో మజిలీ

మతిస్థిరంగా ఉన్నవాడెవడూ మామిడిచెట్టును కొట్టి వేద్దామనుకోడు. ప్రతి మామిడిచెట్టూ రసభరితమైన పండ్లు సమృద్ధిగా ఇస్తుంది. ఈ పండుని 'అమృతఫల' మనీ, 'ఫలరాజ' మనీ పేర్కొనడం కద్దు. పరువానికి రాగానే చెట్టునుంచి దింపిన కాయలు ముగ్గవేసుకుని తింటాము; పచ్చికాయలతో ఊరగాయ వేసుకొని, పచ్చడి చేసుకొని తింటాము. మామిడిపండు రసంతో జామూ, జెల్లీ (తాండ్ర) తయారు చేసుకొని ఆరగిస్తాము. గీసిన మామిడి బద్దల్ని ఎండబెట్టి, పాకం పట్టి మామిడిచిన్నెలుగా చప్పరిస్తాము. మామిడి పండు రసాన్ని పాలుచేర్చి పానీయంగా సేవించవచ్చు. మామిడిచెక్కలోని జీడికూడా దంచి, పిండి చేసి, గోధుమకు బదులుగా వాడవచ్చు. మామిడి పళ్ళరకాలు వందకి పైబడి ఉంటాయి. దేని రుచి దేనిదే!

పండును ప్రశంసిస్తూ చెట్టును మరచి పోతామేమో! భారతదేశం లోని ఠీవి ఉట్టిపడుతూ ఉండే చెట్లలో మామిడి ఒకటి. కాశ్మీరు నుంచి కన్యాకుమారి వరకు దేశం పొడుగునా బారుగా విస్తరించిన కొమ్మలతో పరిచితంగా దర్శన మిస్తూంటుంది.

గుజరాతులో శ్రావణమాసం (జూలై - ఆగస్టు) ఏడవనాటి రాత్రి ఇంటికి దగ్గరగా ఒక లేత మామిడి మొక్కను నాటి, పిల్లలకే జబ్బూ చెయ్యకుండా చూడవలసిందని ప్రార్థిస్తూ - స్త్రీలందరూ దానికి పూజ చేస్తారు. ఒక్కొక్కప్పుడు ఒక మామిడి గుంజను నాటి, విఘ్నేశ్వర పూజ చేస్తారు.

ఉత్తరాది మైదానాల్లోని ఏ ఊళ్లోనైనా మీరు ఉండి ఉంటే, మహా వృక్షాలుగా పెరిగిపోయిన మామిడిచెట్లుగల తోపును తరుచు చూసే

ఉంటారు. ఒక్కొక్కప్పుడు సమ భూమిగా ఉండే సువిశాలమైన గ్రామీణ ప్రాంతం మధ్య ఈ చెట్లు మరుద్యానంలా కనపడతాయి. అందులోని చెట్లకింద ఒక బావి, చిన్న గుడి ఉండవచ్చు అలసి దుమ్ము కొట్టుకుపోయిన పంటకాపు ఇక్కడ కూర్చుని సేద తీర్చుకుంటాడు.



తన మధ్యాహ్నపు రొట్టె తిని, ఆ బావిలోంచి తోడుకుని ఓ గుక్కెడు చల్లని నీళ్ళు తాగుతాడు. మనం అతని సరసజేరి, 'ఎవరు వేసిందయ్యా, ఈ తోట?' అని అడిగితే అతను మనకి ఏం చెప్పలేడు. ఏమో, తన చిన్ననాటి నుంచీ అది అక్కడ ఉంది; బహుశా తన తండ్రి చిన్ననాటినుంచీ కూడా ఉండి ఉంటుంది. కొన్ని మామిడి తోపులు చాలా చాలా ముదివి.

మీరు 'వెయ్యి మొక్కతోట' ను గురించి ఎప్పుడైనా విన్నారా? బహుశా విని ఉండరు. కాని బీహారులోని "హజారి బాగ్" అనే పట్టణం గురించి మీరు విని ఉండాలి. వెయ్యికి పైబడి చెట్టున్న ఒక పెద్ద మామిడి తోటకి ''హజారి'' (హజార్ అంటే హిందీలో వెయ్యి) అన్న పేరు వచ్చింది — ఆ చెట్లలో కొన్ని నేటికీ ఉన్నాయి సుమండీ. ఈ చెట్లచుట్టూ ఒక గ్రామం పెరిగి, అది కాలక్రమాన నేటి హజారి బాగ్, 'వెయ్యిమొక్క తోట' గా విస్తరించింది. ఏమయినప్పటికీ, ఆ పట్టణంలో ఉండే వృద్ధుల నోట వినవచ్చే కథ - అది. ఈనాడు కూడా ఆ పట్టణం మామిడి, వేప, మద్ది, చింత మొదలైన చెట్లుగల ఒక పెద్ద తోటలో ఇంచుమించు మరుగు పడిపోయి ఉంటుంది.

మామిడితోటలో అందరికీ ప్రవేశముంది. కాని పళ్ళకాలంలో తోటలో అడుగు పెట్టడం మాత్రం ప్రమాదకరం! ఈ కాలంలో అక్కడ



ఒక భయంకరుడైన చౌకీదారు కాపలా ఉంటాడు. ఆకతాయి పిల్లల్ని తరిమి కొట్టడమే అతగాడి పని. పహారావాడు నిద్రపోతూ ఉంటే కొన్ని పళ్ళు ఎత్తుకు పోవచ్చునని ఈ పిల్లలు దొంగ చాటుగా తోటలో ప్రవేశిస్తారు.

చౌకీదారుకి చేతినిండా పని ఉంటుంది. కాయలింకా సరిగా పరువుకు రాకుండానే, ఊరి కుర్రసజ్జుతోనే కాక, దాడిచేసే చిలకల దండుతోనూ తలపడవలసి ఉంటుంది. చిలకలు తోటంతా ముసురుకొని, దోరకాయ లన్నీ కొట్టివేస్తాయి. చౌకీదారు ఒక్కొక్కప్పుడు తోటమధ్య ఒక చెటుకింద కూర్చుని, పై కొమ్మలలో పెట్టిన కిరసనాయిలు డబ్బాను డబడబ లాడించడానికి దానికి కట్టిన తాడు లాగుతూంటాడు.



వాటిని అదరగొట్టటానికి అతను కేకలు పెట్టవచ్చును గాని అతనిగొంతు ఆ పచ్చవన్నె చిలకల అరుపులతో పోటీ పడలేదు. అవి తోటచుట్టూ వలయాలు తిరుగుతూ, తోకలు విప్పి, చిటారుకొమ్మలమీద వాలతాయి.

చెట్లను కాయలు లేనప్పుడు కూడా, తోపులో చిలకలు కనిపిస్తాయి. వాటికి గ్రుడ్లు పెట్టడానికి ముది మామిడిచెట్లు కావాలి. బోడిపెలుగల వాటి మానుల కన్నాలలో గూడు పెట్టడం చిలకలకి మామూలు.

నీలం రంగు పాలపిట్టలు, ఆకుపచ్చని కంచరి పిట్టలు, ఇత్యాదికూడా గూడు కట్టడానికి మామిడి చెట్టునే కోరుకుంటాయి. ఒక్కొక్కప్పుడు, ఓ ముదిమాను మధ్య భాగాన ఉన్న కన్నంలోంచి తొంగి చూస్తూ, ఓ గుడ్లగూబ మీకు కనపడవచ్చు.

మామిడి చెట్టును మనం ముఖ్యంగా పండ్లకోసమే విలువగా చూసుకుంటాం; కాని మామిడికర్ర కూడా మనకి రకరకాల ఉపయోగపడుతుంది. మామిడి పలకలతో సామాన్లు కట్టే పెట్టెలు తయారుచేస్తారు. మామిడికర్రతో చేసిన కుర్చీలు, బల్లలు, తలుపులు, కిటికీలు చవకగా ఉంటాయి. మనదేశంలో కొన్నిచోట్ల మామిడిచెట్టు రకరకాల పూల చెట్లకి ఆదరువుగా ఉపకరిస్తోంది. ఆ చెట్లు మావిని అల్లుకొని ఉంటాయి. అవి వేసవికాలంలో పూసినపుడు దానికి పూల మాలలు వేసినట్టు ఉంటాయి.

# బూరుగుచెట్టుమీద

# బువ్వంబంతి

మీరు బాడ్‌మింటన్ ఆడేవారు కాకపోయినా, షటిల్ కాక్ - ఊలు బంతి స్థానే ఉపయోగించే రెక్కల బెండు - మీలో చాలామంది ఎరిగిందే. ఒక రెక్కల చెండు తీసుకొని, దానికి ఎర్రటి ఎరుపు పూశారనుకోండి - ఇంచుమించు అలాగే ఉంటుంది బూరుగు దూదినిచ్చే చెట్టుని పూసే పువ్వు!

ఇప్పుడు, రక్తవర్ణపు పూలు విరగబూసిన, ఆకులన్నీ దూసిన ఎత్తయిన చెట్టును ఊహించుకు చూడండి - వసంతంలో ఈ అచ్చెరువు గొలిపే చెట్టు ఏ విధంగా ఉంటుందో మీకు తెలుస్తుంది. జగతిలో ఇంత శోభాయమానంగా ఉండే చెట్లు చాలా కొద్ది.



ఏ అడవిలోనో, నగరంలో బాటపక్క నాటిన ఏ చెట్ల వరసలోనో మీరు బూరుగు చెట్టును చూసే ఉండ వచ్చు. సరిగ్గా పూలు పూయడానికి ముందు, కొద్దికాలం పాటే, ఆకులు రాల్చి బోడిగా ఉంటుంది అది. అసలు మంచి నీడ నిచ్చే చెట్టు. వేసవిలో, తెల్లని దూది దాని గింజల్ని పొదివి ఉంటుంది. ఏ మాత్రం గాలి వీచినా అది యిట్టే ఎగిరిపోతుంది. దారం తీసి, బట్టలు నెయ్యడానికి ఈ దూది పనికిరాదు. కాని దిండ్లలోనూ, మెత్తలలోనూ కూరడానికి దీనిని ఉపయోగిస్తారు.

అన్ని చెట్లలాగే, బూరుగుకూడ మన జానపదుల విశ్వాసాలతో ముడిపడి ఉంది. మధ్యప్రదేశ్‌కి చెందిన ఆటవికులైన మురియాలు, ఎక్కడ తనుకు నెలవు కల్పించుకోవాలన్నా, ఆ ప్రదేశంలో మధ్యగా ఒక బూరుగుచెట్టును నాటుతారు. వివాహ సమయంలో వధూవరులు ప్రదక్షిణ చేసే గుంజలు తయారు చెయ్యడానికి బూరుగుకర్రనే వాడేవారున్నారు. పెళ్లి పందిళ్లలో బూరుగుకొయ్య చెక్కి చేసిన చిలకల్ని వేలాడ కడతారు. చిలక వనజీవన సరళికి చిహ్నం.

బూరుగుకర్ర చాలా మెత్తగా ఉంటుంది. దానిని ఆట వస్తువులు చెయ్యడానికి వినియోగిస్తారు. చేపలు పట్టేవారు తమ వలలకు కట్టే బెండ్లుగా ఉపయోగిస్తారు. బూరుగు చెట్టు గింజల్ని పశువులకు పుష్టికరమైన ఆహారంగా గణిస్తారు. ఆయుర్వేద వైద్యులు దాని బెరడునుంచి వచ్చే జిగురును మందులలో వాడతారు.

ఎర్రని పూలకీ, కొల్లలుగా పూయడానికీ మాత్రమే కాకుండా, అది పూతలో ఉన్నప్పుడు వచ్చి దానిమీద వాలే పక్షుల గుంపుకి కూడా బూరుగును చెప్పుకుంటారు. కొన్ని పక్షులు ఎర్రెర్రగా, ఇంతంతేసి ఉండే దాని పువ్వులలోని మకరందం కోసం వస్తాయి. ఆతేనె మడుగులో మునిగిపోయి, పూవుదొప్పల అడుగున పడి ఉండే వేలాది కీటకాలను వెతుక్కుంటూ కొన్ని వస్తే గూడు పెట్టుకొనే ఇరవు చేసుకోవడానికి ఈ చెట్టు మెత్తని కర్రను సునాయాసంగా తొలచవచ్చుకదా అని మరి కొన్ని వస్తాయి. కారణం ఏదయినా, ఉదయం మొదలు రాత్రి వరకూ బయటినుంచి వచ్చే పక్షులతో పెళ్ళి హడావిడిగా ఉంటుంది చెట్టు.

ఆ వచ్చేవాటిలో, ఊరిమీద పడి చెరుపు చెయ్యడానికి బయలుదేరే ముందు, రెండు గుక్కలు మకరందం పుచ్చుకు వెడదామనుకునే కాకుల మూకలుంటాయి. అనువైన స్థలాల కోసం తగవులాడుకునే గోరింక లుంటాయి. పికిలి పిట్టలు, ఉక్కుముఖులు, ఏట్రింతలు, కోయిలలు – అన్నీ 'బువ్వంబంతి' పెళ్లి విందులో పాల్గొంటాయి. పక్షులే కాకుండా కొమ్మలమీద పరుగులు పెట్టే ఉడుతలుంటాయి. అవి కుచ్చుతోక లెగర వేసుకుంటూ, వడవడ వదరుతూ, ఒకదాని నొకటి తోసుకుంటూ తిరుగుతాయి. ఈ రద్దీ సాగుతున్నంత సేపూ, పువ్వులు తునియలవుతూ నేలమీద తపతప పడుతూనే ఉంటాయి.

ఈ చెట్టుకు వచ్చే పక్షులలో ఎక్కువగా కనిపించేవి గులాబీగోరలు, (రోజీపాస్టర్స్). ఒక్కొక్కటిగా కాకుండా గుంపులుగా చక్కావస్తాయి అవి. వాటి రంగు బూరుగు పువ్వుల వర్ణంతో పోటీపడుతూ ఉంటుంది. అవి చేసే గల్లంతు ఇంతా అంతా కాదు. పెద్ద దొమ్మీ సాగుతోందా అనిపిస్తుంది. నిజానికి అవి దెబ్బలాడుకోవడం లేదు, చిల్లోపొల్లో మనీ ఆనందిస్తున్నా యంతే!

మన పెద్దరకం తేనెటీగ ఉనికిపట్టుల్లో బూరుగుచెట్టు ఒకటి. ఈ చెట్టు కొమ్మలకి అంటుకొని ఉండే పెద్ద పెద్ద తెట్టెల్లో తేనెటీగలు ఉంటాయి. తిన్నగా అడ్డంగా ఉండే బూరుగు కొమ్మలు ఈ తేనెపట్టు లకు సరి అయిన పట్టు కొమ్మలు.

ఈ తెట్టెల పొడవు అయిదడుగులదాకా ఉంటుంది; వెడల్పు రెండు

న్నర అడుగులుంటుంది. తెట్టెలో నివసించే తేనెటీగలు మూడు రకాలుగా ఉంటాయి: సోమరిగా పొద్దుపుచ్చే మగవి, గ్రుడ్లు పెట్టే ఆడవి, తెట్టె నిర్మించడానికి శ్రమించేవి. ఈ తెట్టెలు తేనెతోనో, మైనంతోనో, పుప్పొడితోనో నిండి, స్థిర నివాసాలుగా ఉంటాయి.

పెద్ద తేనెటీగ కుట్టిందంటే చాలా బాధ పెడుతుంది. దాని కాటు విషపూరితం. ఎండా కాలమైతే ఇంక చెప్పనక్కర్లేదు. కాని ఆటవికులైన కోలులు, సంతాలులు దాని కాటుకి అలవాటు పడిపోయారు. వాళ్లకి విషం ఎక్కదు. అది కుట్టినా వాళ్లు లెక్కచెయ్యరు. అడవి ప్రదేశానికి కొత్తయిన వాళ్లని మాత్రం మొర్రో మొర్రో మనిపిస్తాయి, ఈ తేనెటీగలు. అందుచేత, వాటి జోలికి వెళ్ళకపోవడం మంచిది. మనిషినీ, జంతువునీ కూడా అవి మహా క్రూరంగా ఎదుర్కొని కరుస్తాయి.

ఒకమాటు ఏం జరిగిందో తెలుసా? ఇద్దరు వేటకాళ్ళు భారతదేశ మధ్య ప్రాంతంలోని ఒక అడవిలో తిరిగి తిరిగి అలసట తీర్చుకుంటున్నారు. ఉక్కగా ఉండే మే మాసపు ఉదయం; ఒక బూరుగు చెట్టు మొదట్లో కూర్చుని ఉన్నారు. పైన విస్తరించుకొన్న దాని కొమ్మల్ని ఓ డజను తేనెపట్టులు వేళ్ళాడుతున్నాయి. ఉన్నట్టుండక వేటకాళ్ళలో ఒకడు తెలివితక్కువగా చుట్ట ముట్టించాడు. అలా చుట్టపొగ పైకి వెళ్ళిందో లేదో ఇలా తేనెటీగలు కిందకి వచ్చి పడ్డాయి! ఝుం మంటూ వేటకాళ్ళిద్దరినీ చుట్టుముట్టి తెగ కరిచాయి. వాళ్ళు మానాలు విడిచి, ప్రాణాలు అరచేతిలో పెట్టుకుని పరుగు లంకించుకున్నారు. అలా ఒక బయలు కడ్డంపడి మైలు దూరం పరిగెత్తాక ఒక నది కనిపించి వాళ్లకి రక్ష అయింది. కొన్ని గంటలపాటు దాని నీళ్ళలో కుత్తుకబంటి దాకా ఉండిపోతే గాని వాళ్ళకి ఒంటమీది కరుపుల బాధ తగ్గలేదు!



# నట్టడవిలో మన చుట్టాలు

అడవులలో వర్ధిల్లుతూ, మనకి అత్యంత ఉపకారకంగా ఉండే రెండు దివ్యమైన చెట్లు – మద్ది, ఇప్ప. చెట్లను ప్రేమించే వారెవరూ, తాము నగరవాసులైనా, ఈ రెండింటినీ త్రోసి పుచ్చలేరు.

సాలమే మద్దిచెట్టుని నగరంలోనూ వెయ్యవచ్చుగాని, దానికి తోడు కావాలి. అడవుల్లో తన జాతి చెట్ల మధ్య ఊపిరి పీలుస్తున్నప్పుడే దానికి ఎక్కువ బావుంటుంది. ఉత్తర మధ్య భారతాలలో చెమ్మగా ఉండే చిన్నచిన్న కొండల్నీ, పీఠ





భూముల్ని ఆవరించి ఉండే అడవుల్లో మద్దిచెట్లు విస్తారంగా కనిపిస్తాయి. మద్దిమానుకి కలపగా మంచి విలువ ఉంది. ఉత్తర భారతంలో ఇంటి కలపకి మద్దిమానే ఎక్కువగా వినియోగ పడుతోంది; కాని ఉపయోగ కరమైంది మానొక్కటి మాత్రమే కాదు. మద్దినుంచి స్రవించే రసం - జిగురు పదార్థం - చాలానే లభ్యమవుతుంది. హిందువులు దీనిని గుగ్గిలంగా దేవతలకు ధూపం వేస్తారు. ఈ బంకను పొదిగి పడవ జాయింట్లని, ఓడ సందుల్ని పూడ్చుతారు. నిగనిగలాడుతూ పెద్దదిగా ఉండే మద్ది ఆకుకి కూడా మంచి ఉపయోగం ఉంది. బీహారుకు చెందిన సంతాలు తెగవారు ఎప్పటికప్పుడు ఆకులు కోసుకుంటూ విస్తళ్ళకీ, దొన్నెలకీ వాడుకుంటారు. తెలివిగా చేర్చి కుట్టిన విస్తళ్ళు పప్పు, అన్నం వడ్డించుకోవడానికెంతో అనువుగా ఉంటాయి. పెద్ద ఆకు తీసుకుని, పొట్లంలా ఒక చుట్టు చుట్టి పట్టుకుంటే అందులో నీళ్ళు చక్కగా నిలుస్తాయి.

ఇల్లు కట్టడానికి కూడా ఆకు ఉపయోగ పడుతోంది - మనుష్యులకి కాదు, చీమలకి !

ఎర్రచీమ చెట్టుమీదే పుట్టపోస్తుంది - పెద్దది చిన్న చీమలనుంచి తీసిన జిగటతో పచ్చివాటినీ, ఎండువాటినీ కలిపి అతికించి పోసిన ఆకుల పుట్ట. ఈ పుట్ట నొకదానిని పరీక్షగా (దానిని కదపవద్దు!) చూసి నట్టయితే, దాని నిండా చీమలు బిలబిల్లాడుతూ ఉంటాయి. వాటిని ముద్దు చేద్దామని చూడకండి సుమా ! అవి కూడా పెద్ద తేనెటీగలంత చెడ్డవి - పట్టుకు పీకుతాయి. ఏనుగెక్కి వేటాడుతూ చీమల పుట్టకు రాసుకున్న షికారీలు చాలామంది ఆ అసౌఖ్యం ఎరిగిందే.

మద్దిచెట్టు మీద వాసంచేసే మరొక ప్రాణి, కీచురాయి. అది ఎండా కాలం పొడవునా, వానకాలమంతా అలా కీచుమని రొద చేస్తూండడం మీరు వినే ఉంటారు. చెవులు చిల్లులు పడటానికి ఒక కీచురాయి చాలు ; కీచురాళ్ళతో నిండిన అరణ్యమే అయితే ఇంక చెప్పనక్కర్లేదు. ఆ కీచు రాళ్ళ రొద చెవులకి తలొక రాగం ఆలాపన చేసే గాయక బృంద గానంలాగే ఉంటుంది. అది విని పక్షులు కూడా అదిరిపోతాయి. వాటికి గొంతు మూత పడిపోతుంది.

కాని పోతు కీచురాయి మాత్రమే పాడుతుంది, పెంటిది మూగది. మధ్య భారతంలోని గిరిజనులకి రావిస్థానే మద్ది ముఖ్యమయినది. మార్చిలో ఈ చెట్టు పూసినప్పుడు, 'బహాబొంగ' అనే ఉత్సవం జరుగు తుంది. పెళ్లిళ్లలో, పందిట్లో ఒక వెదురు బొంగును, ఒక మద్దికొయ్యను నాటి, వాటికి నూనెరాసి, పసుపు పూస్తారు. వధువుగాని వరుడుగాని ఆ పెళ్ళికి ఇష్టపడకపోతే, తను మద్ది ఆకును రెండుగా చీల్చవచ్చు.

బుద్ధుని జనన సమయంలో, ఆయన తల్లి చెయ్యి చాచి మద్దిచెట్టు కొమ్మనొకటి పట్టుకుని, బిడ్డడిని ప్రసవించిందట. బుద్ధుడు నిర్యాణం చెందినపుడు మద్దిచెట్లు ఆయనమీద అకాల పుష్పవృష్టి కురిసి, వాటి కొమ్మలు వంచి నీడ పట్టి జోహారు చెప్పాయిట.

అటవికుల్ని ఆదుకునే మరొక చెట్టు ఇంపయిన ఇప్పచెట్టు.

ఇప్ప పువ్వులు - పచ్చివి గాని, ఉడకబెట్టిగానీ - తినవచ్చు. మధ్య పశ్చిమ భారతాలలోని గోండులు మొదలైన తెగలవారి ఆహారంలో ఇవి



ఒక ముఖ్యమయిన దినుసు. అనావృష్టివల్ల బియ్యం కొరత వచ్చినపుడు, ఇప్ప పువ్వులే వీరికి ఆదరువవుతాయి. నిజానికి, పేదలు పూర్తిగా ఇప్ప వంట మీదనే ఆధారపడతారు.

ఇప్ప గింజలనుంచి నూనె తీస్తారు. దానిని దీపాలకీ, వంటలకీ (నెయ్యికి బదులుగా) కూడా వాడవచ్చు. ఇప్ప గింజల నూనె సబ్బు తయారీలో సహితం ఉపయోగిస్తారు.

వేసవి ఆరంభంలోనే ఇప్పచెట్టు విరియ పూస్తుంది. అది మామూలుగా గిరిజనుల ఆదాయం తక్కువగా ఉండే సమయం. సేద్యగాళ్ళు, అప్పుడు చేతిలో పని ఉండదు కాబట్టి, ఇప్ప పువ్వుల సేకరణకి సంతోషంతో పూనుకుంటారు. పంటను తెచ్చుకోవడానికి ఊరు ఊరంతా చక్కా వస్తుంది. పువ్వుల్ని సులభతరంగా పోగుచేసుకోగలిగేందుకు, ఒక్కొక్కప్పుడు చెట్టుకింద ఉండే పచ్చగడ్డిని దగ్ధం చేస్తారు. స్త్రీలు నెత్తి మీద తట్టలు పేర్చుకుని, పిల్లలు చీపుళ్లు చేతబుచ్చుకుని సిద్ధమవుతారు. పువ్వులన్నీ సేకరించడమవగానే, పిల్లలు నేలను శుభ్రం చేసేస్తారు. మళ్ళీ పువ్వులు రాలే సమయానికి నేల సిద్ధంగా ఉంటుందన్న మాట.

ఇప్పచెట్టు పదిహేను రోజులపాటే అలా విడతలుగా పువ్వులు రాలుస్తుంది. ఆ పక్షం రోజులూ గ్రామస్థులు అడవిలోనే మకాం పెడతారు. స్త్రీలు, పిల్లలు ఇలా పంటను పోగువేస్తూంటే, పురుషులు అలా దానిని ఇళ్ళకి చేరుస్తూంటారు.

ఊడ్చి అలికిన నేలమీద ఇప్ప పువ్వుల్ని పరిచి ఎండబెడతారు. ప్రతి పువ్వు శుభ్రంగా ఎండి సగమవుతుంది. రంగు, తెలుపునుండి గోధుమ వర్ణానికి మారుతుంది. సాధారణంగా వట్టి ఇప్ప పువ్వులే్న తింటారుగాని, అప్పుడప్పుడు రుచికోసం మద్ది గింజల్ని, అన్నాన్ని, వాటితో కలిపి తింటారు. ముందు ఇప్పపువ్వుల్ని ఉడకబెడతారు; తరువాత ఎండబెట్టి, వేయించిన మద్దిగింజల్ని, కొంచెం అన్నంతోపాటు చేరుస్తారు.

అడవి జంతువులు, ముఖ్యంగా ఎలుగుబంట్లు, ఇప్ప పువ్వుల్ని ఇష్ట పడతాయి. అయితే మనిషిగాని, జంతువుగాని వాటిని చెట్టు ఎక్కి కోయ వలసిన పనిలేదు. చెట్టు రాత్రి పూస్తుంది, పువ్వులు తెల్లవారేసరికి కింద రాలి ఉంటాయి.



# ఆకసంలో తలలూపే తాళజాతి

నురగలు కక్కే కెరటాలు వచ్చి కొట్టుకునే హిందూ మహా సముద్రతీరం వెంట, ఈసారి మీరు సాయంకాలం షికారుగా నడిచి వెడుతున్నప్పుడు ఒక్కమాటు తలయెత్తి చూడండి. చీకట్లు అలముకొంటున్న ఆకాశ



వీధిని పైకి ఎగబాకుతున్న బ్రహ్మాండమైన సాలీళ్ళలాంటివి మీకు కనిపిస్తాయి. సన్నగా పొడవుగా అంతరిక్షంలోకి పెరిగిపోయి నిత్యం కదలాడుతూండే తాళజాతి చెట్ల తలలివి. గాలే నిశ్చలంగా ఉన్నట్టు కనిపించే వేళల కూడా తమ శిఖల్ని ఊపుతూంటాయి. తుఫాను ముసరినా, పెనుగాలి విసరినా కొబ్బరిచెట్లు మహా బాధలో ఉన్నట్టు తలనిటూ అటూ ఎగరవేస్తూ, నేలకి తగిలేటట్లు వంగిపోతాయి.

చెట్టుకట్టిన తాళజాతులు రమ్యంగా ఉంటాయి. "దివినుంచి భువికి వదలిన బాణా'' లని ప్రాచీన వృక్ష శాస్త్రజ్ఞుడొకాయన వాటిని వర్ణించాడు. కాని ఇంటి కప్పుకనో, వంట చెరకుకనో అప్పుడప్పుడు తాటి కమ్మల్ని నరికివేసి, వాటిని వికృతం చేస్తూంటారు.

కొబ్బరి, తాటి, ఈత, పోక – ఈ నాలుగూ భారతదేశంలో అందరికీ బాగా తెలిసిన చెట్లు. ఏ చెట్టు అంవం ఆ చెట్టుదే. వాటివల్ల కాయ, రసం, నార సమృద్ధిగా లభిస్తాయి. 1583 లో మనదేశం వచ్చిన ఒక ఆంగ్లేయుడు, కొబ్బరి చెట్టును మొదటిసారిగా చూసి, "అది ఏడాది పొడుగునా కాయ కాస్తుంది; ఈతలు కాదు, మనిషి తలకాయలా ఉండే బొండాలు అవి స్వదేశంలోని తన వారికి ఉత్తరం రాశాడుట.

కొబ్బరి కాయంటే భారతీయులకి ప్రాచీనకాలం నుంచీ తెలుసు. పురాణాలలోను, ఇతర ప్రాచీన గ్రంథాలలోను దాని ప్రసక్తి ఉంది. అరబ్బీ ఓడంగులు, వర్తకులు దీనిని భారతదేశపు కాయ' (ఇండియన్ నట్) అన్నారు. పదమూడవ శతాబ్దంలో మలబారు తీరానికి వచ్చినప్పుడు మార్కొపోలో కూడా దీనికి ఆ పేరే వాడాడు. అసలు తొలి కొబ్బరిచెట్టు ఎక్కడ బయలుదేరిందో ఎవరికీ సరిగా తెలియదు - దాని జన్మస్థానం గురించి చాలా సిద్ధాంతాలు ఉన్నాయి - కాని దానిని వివిధదేశాలకు కొనిపోవడం జరిగింది. పూర్వకాలంలో తమిళులు సముద్ర యాత్రికులుగా పేరు కెక్కారు. వారు, వంగదేశపు నావికులు కలిసి ఆగ్నేయాసియాలోని వివిధ ప్రాంతాలలో కొబ్బరి చెట్టును వ్యాపింప చేసి ఉండాలి.

వర్షాకాలం ముగిసే నాటికి 'నారికేళపూర్ణిమ' అనే ఉత్సవం జరుపుతారు. వేలాది జనం సముద్రతీరానికి వెళ్ళి సముద్రుడికి నారికేళాలు సమర్పిస్తారు.



బెస్తలు నావలమీద వెళ్ళి వందన సమర్పణగా పాలు, పూలు, కొబ్బరి కాయలూ సముద్రంలో విడుస్తారు. నీటిరేడు వరుణుడు, వేదకాలము నాటి దేవుడు. కలశరూపంలో- నీటితో నింపిన పాత్ర మీద కొబ్బరి బొండాం ఉంచి _ వరుణదేవుణ్ణి ఆరాధిస్తారు.

కొబ్బరి చెట్టులా కోటి విధాల ఉపయోగ పడే చెట్లు తక్కువ. వీటి ఆకుల ఈనెలతో చీపుళ్ళు కడతారు. పులిసిన చెట్టురసం నుంచి కల్లు తీస్తారు; పంచదార, బెల్లం చేస్తారు. కాయను కప్పి ఉండే పీచు నుంచి నార వస్తుంది. కొబ్బరినీళ్ళు దాహం తీరుస్తాయి. కొబ్బరి ముక్క ఎండి కురిడీ అవుతుంది. ఎండు కొబ్బరి నుంచి తీసిన నూనెని కొబ్బరి నూనెగా అమ్ముతారు. పచ్చి కొబ్బరి రుచిగా ఉండే పుష్టికరమైన ఆహారం.

తాళజాతిలో కొబ్బరి సర్వసామాన్యంగా కనిపించే చెట్టయినప్పటికీ, తక్కినవికూడా ఉపయోగంలో దానికి తీసిపోనివే. వాటిలో ఒకటి, తాటి చెట్టు. కాగితం చెయ్యడం ఇంకా తెలియని రోజుల్లో వీవనల్లా ఉండే తాటి ఆకులమీద గ్రంథాలు రాస్తుండేవారు. పవిత్రమైన హిందువుల వేదాలు, బౌద్ధుల ధర్మపథం మొదట తాళపత్రాల మీదే రాశారు.

తాటిచెట్టు కూడా కొబ్బరి చెట్టంత ఉపయోగకరమైందే. ఇళ్లకి తాటి

పట్టెలు వాసాలుగాను, తాటి ఆకులు పైకప్పుగాను వాడతారు. పులియని తాటిసారాన్ని 'నీరా' అనే సేదదేర్చే పానీయంగా వాడతారు.

వక్క అన్నా, సుపారి అన్నా అందరికీ తెలిసిందే. అయితే, అది సన్నగా, మిక్కిలి పొడవుగా ఉండే తాళజాతి చెట్టున కాసిందని చాలా మందికి తెలియదు. ఈ చెట్లను తీరప్రాంతంలో వేసి పెంచుతారు. మీరు పోకతోటకి దరిదాపుల్లో నివసిస్తున్న వారైతే, సున్నగా, నిటారుగా పెరిగిన పోకమానుల్ని చేతులతో పాదాలతో పట్టి, ఎటు పడితే అటు



వంగుతూ గబగబ ఎక్కుతున్న యువకుల్ని తప్పక చూసి ఉంటారు. ఈ చెట్లు చాలా దగ్గర దగ్గరగా పెరుగుతాయి. ఒక చెట్టు ఎక్కి వక్కలు సేకరించిన మనిషి సరసనే ఉన్న పక్క చెట్టుకి వెళ్లాలంటే అలా ఒరిగితే చాలు, అంది పుచ్చుకుంటాడు. కొబ్బరికాయలు దింపడానికి చెట్టు చెట్టూ చేతులతో కాళ్ళతో పట్టి ఎక్కి దిగవలసి రావడంకంటె ఇది సులువైన పని.

పోక చాలా సున్నితమైన చెట్టు. దానిని పదిలంగా పెంచవలసి ఉంటుంది. ఈతచెట్టు పళ్లు గట్టిగా గుంజు తక్కువగా ఉంటాయి; కాని చెట్టు మాత్రం వనానికి అలంకార ప్రాయంగా ఉంటుంది. చుట్టూ ఉన్న చెట్టుచేమల కంటె ఎత్తుగా, దట్టంగా తురాయిలు తురుముకున్నట్టుండే తలతో గర్వంగా కనిపిస్తుంది. అది సంవత్సరంలో దఫదఫాల గెలలు గెలలుగా పళ్లు కాస్తుంది. ఆ కాయలు బంగారపు రంగు కలిగి ఎండలో మెరిసిపోతూంటాయి. అవి ఎక్కువగా పక్షులకే విందు కూరుస్తాయి; మన

కంతగా రుచించవు. చెట్టు రసంనుంచి మాత్రం పంచదార తయారు చేసుకోవచ్చు.

తాళజాతిచెట్లు సముద్రతీర ప్రాంతంలోనే పెరుగుతాయని మనం మామూలుగా అనుకుంటాం. కానీ ఈత, చిట్టీత దేశంలోని అడవిపట్టు లన్నిటా మొలకెత్తుతాయి; 'మీనపుచ్ఛం' (చేపతోక) అనబడే సాగో చెట్టు హిమవత్పర్వత ప్రాంతంలో కూడా కనిపిస్తుంది. గట్టిగా మేకుల్లా ఉండే మీనపుచ్ఛం చిగుళ్లు చేపల పొలుసులు లాగ ఉంటాయి.



దీని ఆకులు పూర్తిగా విచ్చుకున్నప్పుడు, తాళజాతుల ఆకులన్నిటిలోకి పెద్దవిగా ఉంటాయి. అవి పరువంలో ఉన్న చెట్టుకెంతో అందమిస్తాయి. కాని ముసలితనంలో, ఈ చెట్టుకి, మనకి లాగే, బట్టతల ప్రాప్తిస్తుంది. అప్పుడు దానిని చూసి ముచ్చట పడేవారెవరూ ఉండరు, పాపం!

మీనపుచ్ఛపు చెట్టునుంచి మనకు ఉపయోగకరమైన పదార్థాలెన్నో లభిస్తాయి. దాని పీచుతో పగ్గాలు పేనుతారు. దాని దవ్వనుంచి ఒక రకమైన పిండిపదార్థం లభిస్తుంది. అది సగ్గుబియ్యానికి దగ్గరగా ఉంటుంది. కరువు రోజుల్లో కొండజాతుల ఆకలి తీరుస్తుంది.



# వృక్షదేవతలు

వేము, చింత, మోదుగు, సంపెంగ మనకి చిరపరిచితమైన చెట్లు, మన అభిమానం చూరగొన్నవి. వీటిని గురించి, వీటిలో వసిస్తున్నా యని జనం నమ్మే శక్తిగల దేవతలను గురించి ప్రస్తావించకుండా భారతదేశపు చెట్లకి సంబంధించిన ఏ వృత్తాంతమూ సమగ్రం కాదు.

వర్షాకాలంలో, వేపగింజలు నేలరాలి, కాళ్ళకింద నలిగినప్పుడు వెలువడే ఘాటైన సుగంధం రోజుల తరబడి గాలిలో నిలిచి ఉంటుంది. తక్కిన చెట్లకంటె వేము ఎక్కువ ప్రాణవాయువు విడిచేది కావడమే దానికి కారణం. వేము గాలిని ఎంతయినా పరిశుద్ధ పరుస్తుందనీ, దాని ఆకులు, బెరడు, సారము ఔషధ గుణం కలిగినవనీ పూర్వకాలపు ఋషు లన్నది అక్షరాలా సత్యం. నేటికీ వేపచెట్టుకి వైద్యశాస్త్రంలో గణనీయ స్థానం ఉంది.

ప్రాచీన కాలంనుంచీ, వేముని మనల్ని అనారోగ్యం నుంచి కాపాడే దేవతలకి సంబంధించిందిగా పరిగణించడం జరిగింది. కొందరు దీనిని స్ఫోటకం అమ్మవారయిన శీతలకి పవిత్రమైందిగా భావించారు. అందుకే అమ్మవారు పోసిన పిల్లలకి వేప రొబ్బలతో విసురుతారు. వేపచెట్టు దేవతలు పుచ్చుకునే అమృతంలోంచి పుట్టిందంటారు. ఆ విశ్వాసం ఉన్నవారు తమని భౌతికంగాను, ఆధ్యాత్మికంగానూ కూడా పరిశుద్ధుల్ని చేసుకోవడానికి, ఇప్పటికీ వేపాకులు నమలుతూంటారు.

"వేపచెట్టు లోని సూర్యుడు" అనే వేప బెరడు కథలోలాగ, ఈ చెట్టుకి సూర్యుడితో కూడా సంబంధం ఉంది.



సూర్య భగవానుడొక మాటు ఒక బైరాగిని భోజనానికి పిలిచాడు. ఆ బైరాగికి 'పగటి పూట తప్ప భోజనం చెయ్యి' ననే వ్రత ముంది. వంట ఆల స్యమయింది. చీకటి పడిపోవడంతో తన పని వస్తే అని బైరాగి భయ పడ్డాడు. కాని సూర్య నారాయణ మూర్తి వేపచెట్టు దిగివచ్చి అయన భోజనంపూర్తి అయేవరకు ప్రకాశిం చడం సాగించాడు.

ఆదికాలపు మానవుడు చెట్లను చూసి భయ విస్మయాలకి లోనవుతూ వచ్చాడు. చెట్లు ఎదుగుతూ రావడం, వాటి ఆకులు, కొమ్మలు కదులు తూండడం, అవి కాలగతి చెందినట్టు కనిపించి, తిరిగి వసంతంలో జీవం పోసుకోవడం, విత్తులోంచి ఉన్నపాటున మొక్క మొలుచుకు రావడం - ఇవన్నీ అతగాడికి దురవగాహంగా, అద్భుత మహిమలుగా కనిపించాయి. నిజంగా అవి ఇప్పటికీ మహిమలే, ప్రకృతి దేవత మహిమలు!

చెట్టు పెరుగుతూ రావడం ఒక అద్భు తంగా తోచడం చేత, మనుష్యులు దానిలో ఒక దేవతో, దేవుడో ఉన్నారనీ, చెట్టుపట్ల భక్తి చూపెట్టడం అం



దులో ఉన్న దేవతను భక్తితో కొలవడమే నని నమ్మ సాగారు. మనిషి చెట్టును కొట్టి వేయబోయే ముందు, దానికి తాను కలుగ చెయ్య బోయే హానికి దాని క్షమాపణ వేడు కొన వలసి ఉండేది. వృక్ష దేవతకి నిద్రా భంగ మవుతుందేమో నని రాత్రిపూట చెట్టును కదిలించడానికి కూడా ఇష్టపడేవాడు కాడు. కట్టెలుకొట్టే ఆసామి, చెట్టును పడ గొట్టి, మిగిలిన మోడు మీద ఇంత నెయ్యి పోసి, "మోడులోంచి వన దేవా, మొలుచుకు



రావయ్యా! పెరుగు వెయ్యి మొలకలుగా, పెరుగు వెయ్యి పిలకలతో" అని మొక్కేవాడు.

బేరారులో ఉండే అడవి ఒకటి దాని పక్కనే ఉన్న గుడికి అంకిత మయాక, అందులోని చెట్లను కొనడానికి గాని, నరకడానికి గాని ఎవరూ సాహసించ లేకపోయారు. మధురకు దగ్గరలో ఉన్న పవిత్రవనాలని, శ్రీ కృష్ణుడు బాల్యంలో ఆడుకున్న వనాలని, శతాబ్దాల వరబడిని పదిలంగా చూడ్డం జరిగింది. ఈనాడు పవిత్రవనాలు కూడా మాయమవు తున్నాయి. వాటి స్థానంలో, ప్రజలకని, ఇంకా ఇంకా ఇళ్లు లేస్తున్నాయి. ఇది విచారకరమైన విషయం. ప్రతి మానవుడికీ – ఆరాధించడానికి కాక

పోతే ప్రేమించడానికి కయినా - సొంత చెట్టొకటి ఉండటం అవసరం. చింతచెట్టు చాలాకాలంగా హిందువులకు ముస్లిములకు కూడా ఇష్టమైన చెట్టుగా ఉంటోంది. గ్వాలియరులో, అక్బరు ఆస్థాన సంగీత విద్వాంసుడైన తాన్‌సేన్ సమాధికి నీడ పట్టుతూ, ప్రసిద్ధికెక్కిన చింత చెట్టొకటి ఉంది. గాయకులు తమ కంఠాలు మెరుగవడానికి దాని ఆకులు తినడం సంప్రదాయమైంది. చింతచిగురు వంటకాలలో వాడతారు. చింతపండు ఆహారంగానూ, ఔషధంగానూ కూడా వినియోగపడుతోంది. చింతగింజలు కూడా వృథాపోవడం లేదు. వాటిని చిత్రమైన విధంగా ఉపయోగించడం జరుగుతోంది. గింజల్ని ముద్దగా రుబ్బి, పుస్తకాలను బైండు చెయ్యడానికి వాడుతున్నారు.

బాటపక్క కనిపించే ఇంకొక సుందరమైన చెట్టు చంపకం, సంపెంగ : దాని పువ్వులు మైనంలా మెత్తగా ఉంటాయి. వేసవిలో సాయంకాల మప్పుడు, తమ పరిమళం గుమ్మరిస్తూంటాయి. చాలా రకాల సంపెంగలున్నాయి. కొన్ని చెట్లు చిన్నవి, తక్కినవి పొదవుగా, తీవిగా ఉంటాయి. సంపెంగ మెరుగుదేరే కర్ర — కుర్చీలకు, బల్లలకు ఉపయోగిస్తారు. పూజాపురస్కారాలలో ఈ పువ్వులు తరుచు వినియోగిస్తారు.



అహమదాబాదులో ఒక గొప్ప సాధువు సమాధి దగ్గర వయసు చెల్లిన ఒక పెద్ద చంపకవృక్షం ఉండేది. బహుశా ఇప్పటికీ ఉందేమో- దాని కొమ్మలకి గాజులు వేల్లాడుతూ ఉండేవి. పిల్లల కోసం తపిస్తున్న వాళ్లు వచ్చి, ఆ సాధువుకి గాజులు సమర్పిస్తూండేవారు. వచ్చినవాళ్ల తాహతును బట్టి సమర్పించే గాజుల సంఖ్య ఉండేది. సాధువు వాళ్ల కోరికను కటాక్షించినట్టయితే, చంపకం "గాజులు పెరుకుకొని తన కొమ్మలకి తొడుగు" కొనేది.





నేత్రపర్వంకావించే మరొక చెట్టు పలాశ మనబడే మోదుగ. ప్లాసీ యుద్ధరంగానికి ఆ పేరు 'పలాశ'ను బట్టేవచ్చింది. ఈ చెట్టు పూత పట్టేటప్పుడు ఆకులు రాల్చడం మామూలు. నారింజ పండు రంగు పూలతో అందమైన రెమ్మలతో పై కొమ్మలు, బయటి కొమ్మలు ఆకర్షణీయం గా ఉంటాయి. హోలీ సమయంలో విరజిమ్మే బుక్కా గుండకి రంగు వెయ్యడానికి ఈ పువ్వు ల్ని ఉపయోగిస్తూంటా రు. ఈ చెట్టుకర్రలో అగ్నిబీజం ఉంటుం దన్న నమ్మకంతో, దానిని కర్మ కలాపా ల్లో అగ్నిహోత్రాలను జ్వలింప చెయ్యడానికి వాడుతూంటారు.

తుమ్మచెట్టు చూడ్డా నికి అంత ఆకర్షణీయం గా ఉండదుగాని, దాని పట్టకి, కర్రకి మాత్రం

మంచి విలువ ఉంది. ఇంకొకటి, అది ఎక్కడ పడితే అక్కడ మొలుస్తుంది. నిర్జలభూమి అనీ, బురదనేల అనీ చూడదు. తుమ్మకర్ర గట్టిగా ఉండి, బాగా మన్నుతుంది. దీనితో బండి చక్రాలు, నూతిపై అంచులు, నూనె తీసే పరికరాలు, దంపుడు రోకళ్లు, నాగళ్లు మొదలైన ఉపకరణాలు చేస్తారు. పశువులు, గొర్రెలు, మేకలు పసందు చేసే ఆహారం తుమ్మకాయలు.

ప్రతి వృక్షానికీ సంబంధించి ఎన్నో గాథలు, విశ్వాసాలు అనాదిగా ప్రచారంలో ఉన్నాయి. భారతదేశంలో పెరిగే చక్కని చెట్లన్నిటిని గురించీ ఇక్కడ ప్రస్తావించడం సాధ్యం కాదు. కాని మన వృక్షదేవతలకు కోపం రాకుండా - ఎప్పుడు వీలుపడితే అప్పుడు, ఎక్కడ వీలయితే అక్కడ అన్ని రకాల చెట్లు నాటుతూ వనమహోత్సవాలు జరుపుతామని వాగ్దానం చేద్దాం.





## హిమాలయ ద్రుమాలు

భారత దేశపు మైదానాల్లో సాధారణంగా కనిపించే వేప, మామిడి, తుమ్మ, చింత, బూరుగు చెట్లలో ఏ ఒక్కటీ పర్వతాలమీద పెరగడం చూడం. శీతోష్ణస్థితి అంత తేడాగా ఉంటుంది. ఈ చెట్లకి బదులు (6,000 అడుగుల ఎత్తుకి పైన) రోడోడెండ్రాన్స్, దేవదారు, నిత్యం

పచ్చగా ఉండే సిందూరపుచెట్టు (ఓక్) బూరుగు మానువంటి సొబగైన హార్స్-చెస్ట్‌నట్ మనకి ఎదురవుతాయి.

'దేవదారు' సంస్కృత పదం – దేవుని చెట్టు అని అర్థం. దేవదారుల మధ్య కొన్నాళ్లు నివసించిన వారికి, దేవుడికి ఈ చెట్టంటే ఎందుకిష్టమో తెలుస్తుంది. అది ఒంటరిగా పెరుగుతున్నా, దేవదారి అడవిలో ఒకటిగా ఉన్నా, తన నేస్తాలైన నీలపు పైన్. స్ప్రూస్, ఫర్‌ల నడుమ ఉన్నా – హిమాలయ ద్రుమాలన్నిటిలో ఉదాత్తమైంది. దానికి దర్జా సొగసు, ద్రఢిమ ఉన్నాయి. అది తన బుజాలమీద మంచుని అలవోకగా దులిపి వేసుకోవడం చూడండి – దాని దర్జా ఎటువంటిదో తెలుసుకుంటారు. అది తన పల్చటి, పచ్చని కొమ్మలతో గాలిని పట్టి దానిచేత చల్లగా మెల్లగా పాడిస్తూంటే వినండి, అది దేవుడికి చేసే వినతి ఏమిటో తెలుస్తుంది.

చిర్ పైన అంత పరిమళభరితమైంది కాకపోయినా, దేవదారు మధుర తరమైన సంగీతం వినిపిస్తుంది. చెట్లే నడక నేర్చినవైతే, జమాజెట్టీ లాంటి దేవదారు నడుస్తూంటే చూసి తీరవలసిందే. ఉత్తాల దేవదారు సేనావాహినీ పర్వతాలమీద కదలిపోతూంటే ఎలా ఉంటుందో ఊహించు కోండి!

భారతదేశంలో కలపకి కామధేనువు లనదగిన మూడు చెట్లలో దేవదారు వొకటి - తక్కిన రెండూ టేకు, మద్ది. ఇంటి కలపకి దేవదారు మాను విరివిగా వాడతారు. రైల్వేస్లీపర్ల కిది ప్రశస్తమైన కర్ర. చిర్ పైన్ కర్ర దేవదారువులా చాలాకాలం ఉండేది కాదు: కాని ఈ చెట్టు నుంచి సజ్జరసం కడవలకొద్దీ లభిస్తుంది. దానితో టర్పెంటైను, రెజినూ తయారు చేస్తారు. ఎండుపళ్లలో ఎన్నదగినదై, ఉత్తర భారతమంతటా తెలిసిన చిల్ గోజా పైన్ చెట్టు విత్తనమే.



పైన్ దేవదార్లలాగ నీటుగా ఉండదు. సిందూరపుచెట్టు తల విరబోసుకుని ఉంటుంది. దాని వంకర కొమ్మలు అన్ని పక్కలకీ పొడుచుకు వెడతాయి. ఆ కొమ్మల్ని నరుక్కుపోయినప్పుడింక దాని అందం చెప్పక్కర్లేదు. అప్పటికీ అది పిట్టల్నీ, పురుగుల్నీ చుట్టాల సురభిలా చూస్తుంది. వడ్రంగిపిట్ట ఆహారపువేటలో చెట్టుబెరడు బొడిపెలు, బీటలు నిడుపాటి ముక్కుతో అదేపనిగా పొడుస్తూ చేసే శబ్దం పర్వతాలమీద వినరావడం మామూలే. ఒక్కొక్కమాటు చెట్లమీద పక్షులున్న అలికిడేమీ లేని సమయంలో, ఉన్నపాటున హెలికాప్టరు సమీపిస్తూంటే అయ్యే 'ఉర్రు' మనే ధ్వనిలాంటిది వినవచ్చి, పొడుగు తోకల, నీలంరంగు కొండకాటిగాడు (మాగ్పై) పిట్టలదండు సిందూరపుటడవికి అడ్డంపడి ఎగురుతూ రావడం కనిపిస్తుంది.

ఈ చెట్లమీద ఏడాది
పొడుగునా పక్షులు కని
పిస్తాయి - ఫిబ్రవరిలో
జట్లుజట్లుగా ఆకుపచ్చని
చిలకలు, వెల్ల గవదల
పికిలి పిట్టలు, అప్పుడ
ప్పుడు గాలిలో తిరుగుతూ
కీటకాలను పట్టే దాసరిపిట్ట
కూడా. అన్ని కాలాల
లోనూ ఉండే థ్రష్, అనే
ఈలపాట పిట్ట. పాట విన
బడ్డమే కాని, పిట్ట కన
బడ్డం అరుదు. దాని అమల
మోహన సంగీతం ఎందు
కో తుంచి వేసినట్టుగా





ఉంటుంది - చివరికి వచ్చేటప్పటికి రాగం
మరిచిపోయినట్టు. ఆ తరువాత హరిత
వర్ణపు డక్కుముఖి ఉంటుంది. అన్నిటి
కంటె ఎత్తుగా ఉండే స్ప్రూస్‌నో, దేవ
దారునో ఎన్నుకొని - సరిగా దాని కొట్ట
కొనను కూర్చొని అంతులేని తనపాట
అందుకొంటుంది. కొండలమీద ఉండే
వారు దీనిని గురించి ఒక కథ చెబుతారు.
ఈ పక్షి పూర్వజన్మలో ఏదో వ్యాజ్యం
లో ఓడిపోయి, ఆ విచారంతో చచ్చి

పోయిన వడ్డీ వ్యాపారిట. అందుకని, అది "అన్యాయం, అన్యాయం" అంటూ అలా ఎడతెగకుండా భగవంతుడికి మొరపెట్టుకుంటూ ఉంటుంది.



వర్ష ఋతువులో నాచు, అడవిమొక్కలు సిందూరం, రోడోడెండ్రాన్ మానుల్ని అంటిపెట్టుకొని జాలరుల్లా వేల్లాడ్డం కద్దు. కాని మార్చిలో హిమవత్పర్వతారణ్యాలు గన్నేరువంటి రోడోడెండ్రాన్ పూసిన ఎర్రని పూలతో వెలిగిపోతాయి. రోడోడెండ్రాన్ యూరప్‌లో వట్టి తుప్పే అయినప్పటికీ, హిమాలయాలలో పెద్ద మానే. ఈ చెట్టు పూతలో ఉన్నప్పుడు రాలిన పూవు రేకులు అరణ్యభూమి అంతా పరచుకొని ఉంటాయి. రోడోడెండ్రాన్ పుష్ప కలశాలు మకరందంతో నిండుగా ఉంటాయి. నల్ల పికిలి పిట్టలు కిలకిల్లాడుతూ జట్లుజట్లుగా వచ్చి మకరందాన్ని తప్ప తాగుతుంటాయి. పార్వతీయులు ఈ పువ్వులతో చేసే పచ్చడి మంచి రుచిగా ఉంటుంది.

యాపిలు, బేరి, ఖర్జూరు, శప్తాలు, రేగు, నేరేడు, అక్రోటు సమశీతోష్ణమండలపు పళ్లు. వీటి చెట్లు మరుగుగా ఉండే లోయలలో బాగా పెరుగుతాయి. అక్రోటు ఆకులు రాల్చినప్పుడు కూడా అందంగా ఉంటుంది. దేవదారులాగే అచ్చంగా హిమాలయాలలో పుట్టిన చెట్టు. యాపిలు అంటుకట్టింది - నూటయాభయి సంవత్సరాల క్రితం ఇంగ్లండు నుంచి వచ్చింది. ఇక్కడ అద్భుతంగా స్థిరపడి పోయింది. ఇప్పుడు పర్వత ప్రాంతంలోని చాలా జిల్లాలలో యాపిల్సు పండుతున్నాయి.

మార్చి నెలాఖరు వరకు యాపిలు చెట్లు నిద్రపోతూ ఉంటాయి. అప్పుడు ప్రకృతిలో కనిపించే అద్భుతాలలో ఒకటి జరుగుతుంది. ఒకనాటి ఉదయం లేచేసరికి మనకి చితకబూసిన చెట్లు దర్శనమిస్తాయి. తెల్లటి పూలు సముద్రంలా విస్తరించి ఉంటాయి. వెనక పర్వతశ్రేణులు నిలచి ఉంటాయి. తేనెటీగల మంజుగానంతో వాతావరణం పులకించి పోతుంది. జూన్ నెలాఖరుకి చెట్లు - పవడపు ఎరుపువి, నారింజరంగువి, పచ్చపచ్చనివి, పలురంగుల యాపిలుపండ్లతో నిండి ఉంటాయి. ఇంకా పైన, పదివేల అడుగుల ఎత్తుకు వెడితే, సర్వసామాన్యంగా కనిపించే చెట్టు సిల్వర్ ఫర్ అనే తాళిస పత్రి. పన్నెండు వేల అడుగుల ఎత్తుకు పైన, శైత్యమెక్కువై, ఫర్ చెట్లు గిడసబారి, మరుగుజ్జుల్లా ఉంటాయి; ఇప్పుడు తట్టుకో గలిగిన జూనిపర్ చెట్లు, భూర్జము మాత్రమే కనబడతాయి. క్రమంగా ఇవికూడా మాయమయి, శిలల నడుమ పెరిగే కొన్ని

అడవి పువ్వులు మాత్రమే కనిపిస్తాయి. అంటే మనం వృక్ష శ్రేణిని చక్కబెట్టి, అంతులేని హిమశ్రేణిని చేరామన్న మాట. ఇక్కడేమీ పెరగదు, పెరగవలసిన పని కూడా లేదు. ఏమంటే, మనం ప్రపంచ శిఖరానికి — దేవతల నివాసానికే చేరుకున్నాం.



Printed at Goyal Offset Works, A60/1, G, T. Karnal Road, Delhi - 110033.